# భక్తిరసామృతము.

గ్రంథకర్త్రి:

బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులుగారి

మనుమరాలగు

చీమకుర్తి సత్యవతి.

---

ప్రకాశకర్త:

చీమకుర్తి బసవయ్యగారు, గుంటూరు.

---

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల బెజవాడ.

[illegible]]　　1922　　[వెల రు 1-0-0

ఓమ్.

# భక్తిరసామృతము.

చిమకుర్తి సత్యవతి ప్రణీతము.

ప్రకటనకర్త:

చిమకుర్తి బసవయ్యగారు, గుంటూరు.

ప్రథమముద్రణము: 1000 ప్రతులు

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు.
క. కోదండరామయ్యచే ముద్రితము.

 1922 [వెల రు 1.

# పీఠిక.

నాకుఁ బాల్యప్రాయమునుండియుఁ పద్యరచనయందాసక్తి యెండు. వచనకావ్యములకంటె పద్యకావ్యముల జదువుటయెక్కువ ప్రీతి. ఛందోవ్యాకరణాది శాస్త్రములను, గావ్యంబులనభ్యసింపకయే, భగవదనుగ్రహలబ్ధ కించిద్గ్రంథపఠన జన్యజ్ఞానలవముచే భక్తియుక్తం బుగ నీపుస్తకమును వ్రాయ బ్రారంభించితిని. ఇదిపూర్తినొంది 10 సంవత్సరములైనను గారణాంతరములచే ముద్రించుట కిష్టపడనైతి. నాబంధువులలోననేకులు పుస్తకము త్వరలో నచ్చొత్తించిన బాగుగ నుండుననియు దీనిఁజదువువారలకుఁ దమ కభిలాషగలదనియుఁ జెప్పుచుండుటచే నాహృదయేశుననుగ్రహభాగ్యమున నేటికిముద్రింపనయ్యె. శాస్త్రపరిజ్ఞానరాహిత్యనా నాచే బాల్యమునందే వ్రాయబడిన యీపొత్తమునందుఁ బొరపాటునఁ గల్గుదోషంబులు పెక్కులుం

దకమానవు. గుణగ్రహణపారీణులగు పండితోత్తములు "చెంతకునాదు వంకవోయిన చేప నతీవ" యనునట్లు నీసలోపంబులనెంచక గుణములనే గ్రహింపవేడెద. ఈపుస్తకరచనకుం బ్రోత్సహించి నాకుత్సాహముగలిగించిన మదీయగౌరవాస్పదులగువారికి వందనశతంబులు. మరియు పుస్తకమువ్రాయవగినంత సామర్థ్యము నాకులేకున్నను నా హృదయకమలమునందు తానేనిలిచి నాకుశక్తిసామర్థ్యములు గల్పించి పలువిధముల దోడుపడిన త్రిమూర్త్యాత్మకుండును సర్వజ్ఞానసగోచరుండును, భక్తాభీష్టఫలప్రదుండును నగు పరమేశ్వరుని దివ్యచరణారవిందములకే యీపుస్తకమును సర్వాపరాధక్షమాపణగోరుచు సమర్పించి కృతకృత్యనైతి.

గుంటూరు,
1-6-1922.

ఇట్లు
చీమకుర్తి సత్యవతి.

# కృత్యాది.

క॥ శ్రీగరుడనందివాహుల
భోగీంద్రశయానదివ్య భూషలగిరిజా
సాగరసుత హృదయేశుల
నాగమవందితులగొల్తు ననిశముమదిలోన్.

సీ॥ దానధర్మములు సత్క్రతువులుగావించి
ధన్యుడయ్యెను మత్పితామహుండు
తపశ్శీలుడై పెంపలరంగ సత్కార్యముల్
దానాచరించె మాతామహుండు
వేదవేదాంగ సద్విద్యలందత్యంత
విజయుడై మెప్పొంద పెద్దతండ్రి

ప్రజలచేదానతి ప్రజ్ఞానవంతులై
మన్ననవడసె నామాతులుండు
గీ॥ ఘనులకీర్తినార్జించి లోకంబుబాసి
మోక్షసామ్రాజ్యమునుబొంది ముక్తులైరి
ప్రణతులొనరింతు వారలపాదములకు
సర్వదావారినామంబు సంస్మరింతు. 1
సీ॥ శాంతస్వరూపులై జనులమేలునుగోరి
గ్రంథముల్ రచియించి ఘనతగాంచి
చిత్రలేఖనమందు చిరతరసత్కీర్తి
గడియించివెలసె నాకన్నతండ్రి
సగుణాలవాలమై సుదతీమణులకెల్ల
దామార్గదర్శమై ధన్యయౌచు

. నేలోపమును లేక యిహపరంబులనుసా
ధించిమించెను నస్మదీయజనని
గీ॥ వందనశతంబులర్పించి వారిపాద
పద్మములగొల్తునేప్రొద్దు భక్తితోడ
నిట్టిలలితంపుశ్రీలకును జనింపజేసె
నట్టిదేవునిభక్తితోఁ నభినుతింతు. ౨
సీ॥ అన్నశాస్త్రిద్ధంబె ముఖ్యంబనినాదించి
వేదోక్తమునుముందు వెలయఁజేసి
దశరాత్రిలే వైశ్యులకెల్ల నాశౌచ
విధియంచు దానెగావించెమున్న
భగవదార్పణబుద్ధి బాలురకుపనయ
నాదులనొనరించె నధికప్రీతి

మహితకార్యంబెద్ది మదికిఁదోఁచిన, దాని
దీక్షతోఁగావించి తృప్తినొందు
గీ॥ నట్టి మత్ప్రియభర్త కవార్కికంబు
బ్రీతిసాష్టాంగ దండమర్పించుదాన
నిట్టిమహాసీయుపతిగాఁగ నిల జనింప
నిహపరంబుల సాధింప నేదుకొంరత. 3

| గీ॥ | | |
|---|---|---|
| | బ | హలిని నిర్మలతరకీర్తిభవ్యమూర్తి |
| | స | త్యపథవర్తి బంధుపోషపవర్తి |
| | వ | రలుహృదయాంబుజ భానుమూర్తి |
| | యా | నగ చేరొందు మన్నాధు నభినుతింతు. |

# అభిప్రాయములు

ఉ॥ భక్తిరసామృతంబౌటకు భావమునన్ రుచిజిల్కు నీశ్వరా
సక్తినిజూపు ఘోరకలుషంబులబాపును ముక్తికాంతపై
రక్తినినిచ్చు దుర్భరవిరక్తినిదెచ్చు బఠించువారికిన్
భక్తిరసామృతంబను ప్రబంధము; దీనిమహత్వమెట్టిదో.

గీ॥ గానము కవిత్వమును సాధ్వి కంఠభూష
గాని మగవానిసొమ్మెప్డు గాదుకాదు
గానసేవాణి నుభయాభిమానినిగను
తద్జ్ఞు లనిరంచు నీదుపాత్రంబుదెల్పె.

క॥ కవితకువలసిన గానముల
కవులెన్నిటి జెప్పినారొ కలవన్నియు నీ

భక్తిరసామృతము.

కవితగా గావున నిల నో
కవయిత్రి! నిలుచునీదు కబ్బముస్థిరమ్ము.

అవధానిశిరోమణిః, శాస్త్రీ కృష్ణాచార్యః.



గీ॥ భక్తిరసముప్పతిల్లగఁ బద్యవితతి
నల్లి "భక్తిరసామృతం"బనెడి నామ
మిడిన త్వద్గ్రంథమును దిలకించి డెంద
మంద నానందమొందితి నన్నమిస్న!

బెజవాడ,
12-8-22.



కర్లపాలెం కోదండరామయ్య,
సౌగంధికాపహరణ, కవిత్వతత్త్వదర్శన గ్రంథకర్త.

# భక్తిరసామృతము.

## శ్రీ ర స్తు.

శ్రీగుంటూరుపురవాస్తవ్యులును, వైశ్యకులోద్భవులును, సచ్చరిత్రులునగు శ్రీ చీమకుర్తి బసవయ్యగారి సతీమణియయిన సత్యవతీదేవిచే బాల్యదశయందే యాంధ్రమున రచియింపబడిన "భక్తిరసామృత" మనెడి గ్రంథము కేవల సార్థకనామమనుట స్వభావోక్తియే గాని యతిశయోక్తికాదు. ఇది సమంజసమైన పద్యకావ్యము. "దేశభాషలందు దెలుగులెస్స" యను లోకోక్తికిది తార్కాణము. గ్రంథమంతయు మొదటినుండి కడవరకు నేకశైలినొప్పుచు ముద్దులుగుల్కుచు, ద్రాక్షాపాకమున నున్నది. ఇందు గవిత్వవిశేషము లెన్నియేనిగలవు. ఇందలి వృత్తములనేకము లుండుటయేగాక గానయోగ్యములుగనున్నవి. ఇదియొకశతకము కాదుగాని శతకసంచయమనందగి

పుట్టువనిలోన మేటివై కొంటివమ్మ
పతకమును వైశ్యరత్నమా! పరీక్షయాం.

రాజవైద్య, గ్రంథి వెంకటసుబ్బరాయగుప్త,
వంజూరు.

---

21-2-21 తేదిని స్త్రీల సభాగ్రేసరురాలుగానున్నప్పుడు
పులికొండ రుక్మిణీసత్యారత్నముచే జదువఁబడిన పద్యము.

సీ॥ చిత్రలేఖనమును చెలువొప్ప లిఖియించి
మెప్పును వడయంగ మెలఁగితమ్మ
చారుతరంబుగా సంగీతమును బాడి
వేడ్కనొసంగగా వెలిగితమ్మ

పరమేశు నుతియించు పద్యంబులల్లుచు
శీలంబు మించగా చెలగితమ్మ
వెలదులు మెచ్చంగ వింతవింతగకుట్టు
పనులందు మెప్పును బడసితమ్మ

గీ॥ బాలికలకును పాటలు బాడునట్టి
సరణిదాపించు మార్గంబు బరగితమ్మ
మానినీరత్నములకెల్ల మార్గదర్శి
వౌను విల చీమకుర్తి సత్యవతి యువతి.

---



# భక్తిరసామృతము.

కైలాసగిరీశ యీశ శివ సచ్చిదానంద సర్వేశ్వరా
శ్రీకంఠా భవపాశనాశ వరకాశీవాస విశ్వేశ్వరా
పాకారిప్రముఖామరార్చితపదా! పాపౌఘవిధ్వంసకా
నీకారుణ్యముఁజూపి బ్రోవగదవే నిత్యంబు నిన్వేడెదన్

మ॥ కరుణాసాంద్రుఁడు లోకరక్షకుఁడు శ్రీకంఠుండు గౌరీమనో
హరుఁడున్ బన్నగభూషణుం డఖిలలోకారాధ్యుఁడున్ జంద్రశే
ఖరుఁ డుగ్రుండు త్రిశూలపాణియు నుమాకాంతుం డటంచున్ బుధుల్
నిరతం బేమహనీయుఁ గొల్తు రతఁడే నిత్యంబు మమ్మేలుతన్॥ 2

భక్తిసామ్రాజ్యము.

చ॥ గరిమముదాల్చి కొంతమున గావగలేనగా మున్నులోకముల్ ౨
హర! నినువేడినంతన శశాంకునియందు గళంక మెంచకే
శిరమునదాల్చితేవో శివ! చిన్నతనంబని యెంచినావె?
నీ చరణయుగంబునమ్మి నాడె సత్కృతినిచ్చిగ స్వీకరింపవే॥
3 మ॥ జనకా! మాపయిరోషమే? కరుణ లేకంబైనలేదే మొరల్
వినవే! భక్తులగావవే! గతియునీవేకావ! వేరున్నదే!
యనఘా! నీచరణారవిందముల నిత్యంబున్ మదిన్నమ్మమే?
చనునే! నీకిదన్యాయమహా! జగదీశా! మమ్మురక్షింపవే॥
4 ఉ॥ నేరనుతండ్రి! నీవు మహనీయగుణంబుల నెంచ ఘోరసం
సారము నస్థిరంబనుచు, శాశ్వతమై సుఖమైన నీదరిం
జేర నిరీక్షకర్మమిక శ్రీకరమా పరమెట్లు లెంచెదన్
భారమునన్నుగావ నిజభక్తవశంకర శంకరా! హరా! 5

ఉ॥ దాములనిచ్చి జేమరక దండిగ నీకరుణామృతంబుచే
గాసియొకింతలేక మెసుఖప్రదమౌ వరమొందఁజేయవే
నీసరి దైవమెన్నగను నీవెగదా! యొరులున్నవారలే
భాసురమైన నీకరుణ బాయక యుంచవె చంద్రశేఖరా। 6
ఉ॥ కావుము భక్తపాలన! యఘంబుల నెన్నక సైచి నన్ను నీ
సేవకు పాత్రురాలనుగ జేకొని నీదరి జేర్చి ప్రోవుమీ
పావకదివ్యనామము సదాభజియించెడివారి కోర్కెలన్
పావనమూర్తి! తీర్పవె! యపారకృపామతి చంద్రశేఖరా। 7
ఉ॥ నాయిలవేల్పు నీవె శరణాగతవత్సల భక్తపాలన
న్నీ యెదనుంచి ప్రోవుమిక నీచములౌ నిహలోకభోగములే
హేయములంచు రోసితిని హీనములౌ జననాద్యవస్థలన్
బాయగఁజేసి నీదగుకృపన్ గనుమిప్పుడె చంద్రశేఖరా॥

ఉ॥ భారమె భక్తకోటికి ముదంబొనగూర్చెడి నీదు సత్పదాం
భోరుహ సేవనంబులు పూర్ణముగా నొనరించు వేళ? నా
నేరములెంచితో! జనక! నీకృపజూపక నాచరించితో
భారమటంచు నెంచితివొ! బాసితొ విశ్వల! చంద్రశేఖరా ॥ ౯

మ॥ పరమేశా! భవదీయమూర్తి నవలో బంధించి నిల్పంగ నా
తరమే నిశ్చలభక్తియున్న! నికరంపుధ్యానమున్ నిల్పు నీ
చరణాంభోజము లాశ్రయించితిని నీసాన్నిధ్యమందుంచి నా
పరితాపంబును దీర్చి పూర్ణకరుణన్ పాలింపవే ముక్కంటిదేవా ॥ 10

చ॥ పిలిచిన పల్కుకుంటివట భక్తులపై కృపతోడ! నీకని
శ్చలమని నమ్మి తావకభవనాగము మీరుచునుంటి నయ్య నీ
వలుకవహించినావా? భవదాజ్ఞ లెరింగియు మీరుచున్న యీ
ఖలులను జావ నొల్లనని గ్రక్కున దర్శనమీయకుంటివా ॥ 11

ఉ॥ ఏమని విన్నవింతు, నది యెప్పటిదేగద యంచు చిత్తమం
దేమనుకొందువో? కరుణ నేలెదవో? కఠినంబు జూపెదో?
బాములబెట్టెదో? సుతుల బాలన ముంచెదొ, నీటముంచెదో?
నా మొరలాలకించెదవొ? నన్ను దయం జేసెదవో? మహేశ్వరా!॥ 12

చ॥ ఎరుగక పాపకృత్యముల నెన్నియొనర్చితినో? మహేశ! నే
నెరిగి యొనర్చినట్టి క్రియలే మితిమీరి భయంబుగొల్పెడిన్
దురితములన్ క్షమించి దయతోనను బ్రోవుమటంచు నెట్లు ని
శ్శరణని వేడికొందు భవసాగర మెట్లిక దాట జాలుదున్॥ 13

మ॥ నను గన్నయ్యవు నీవెకావె జనకా! నాపాలిభాగ్యంబ! నన్
గనులం గాంచవె బిడ్డనంచు నెదలో గారుణ్యమింపార "నో
తనయా! రమ్మిక బ్రోతు" నం చభయహస్తంబిచ్చి రక్షింతువే ?
నిను వీక్షించుచు నెన్నడే నిలలో నే ధన్యతం గాంతునే॥ 14

ధృవ॥ శరణుదేవ! మహానుభావ ప్రశాంతమానస యీశ! నీ
చరణపద్మము లాశ్రయించితి జాలమేల మహేశ్వరా
యెరుగకుంటివా? నాదుబాధల నేవిధంబున బాపెదో?
కరుగకుండెనో నీమనంబిక కావవే కరుణాకరా! ॥ 18

సంచ॥ బిరాన నిన్ను జేరగోరి బిడ్డలెల్లవేడగా
పరాకుజేసెదేల? మాకు ప్రాపు నీవెగాదొకో
నిరాకరింతువేల తండ్రి నీవె యిట్లుజేయగా
మరేదిదిక్కు దేవదేవ మా మొరాలకింపగా । 19

చరణ॥ నమస్తలోకపాల! సర్వసౌఖ్యదాయకా శివా
యుమామహేశ నిన్ను నమ్మియున్న వారమేగదా
క్షమాది సద్గుణమ్ములిచ్చి స్వామి మమ్ము బ్రోవవే
నమోఘదుఃఖహర లోకనాయకా కృపాకరా! 20

కందము॥ పరమేశ్వర నీ పదపంకజముల్
నిరతంబును నామదినిల్పద నో
శరణాగతరక్షకస్వామి న
న్గరుణ మోక్షమొసంగుము గొల్తునిన్నున్॥ 21

ఉ॥ పాపపుసంసార విషయజాలములందున జిక్కియుంటి నే
తీరునైన బొంది నాలదీరిచి నీకు సేర్పకుటీవు
నేరని నేరమొంది యిటు నీకృప నావయి జూపకుండితో?
భారమటంచు నెంచితివొ? పాపుల రక్షల చంద్రశేఖరా!॥ 22

ఉ॥ ఎప్పుడు నీదు నామమును యింపుగ పాడగ గోరుచుందు నా
తప్పుల నెన్న నేల? ఘనుదైవమ! నీవె యుపేక్ష జేసినా
చప్పున నన్ను బ్రోవగల శక్తు లెవండిక; జూడ సర్వదా
యిప్పుడమిన్ స్వభావమని యెంచగదే కరుణామయా! హరా! 23

మత్త॥ సర్వలోకవిభుండవౌదువు పాటి సేయ తేరుగా
యుర్విబాధల నొందికుందుచు నుండజాలను బ్రోవరా
సర్వదానిను నమ్మికొల్చెద సంకటంబుల బాపవే
గర్వభంజన భక్తరంజన కామితార్థము లీగదే॥ 24

ఉత్సా॥ సన్నుత ప్రభావ దేవ సర్వలోకవందితా
నిన్నుబోలు దైవమేము నిక్కముగను తేరుగా
పిన్న పెద్దలెన్న నేల పలువగాని రమ్మి నా
విన్నపంబు నాలకించి వేగకోర్కె లీగదే॥ 25

సుగంధి॥ పావనాన చిత్తనౌచు సన్నుతింతు నెమ్మదిన్
పావనంబు సర్వలోక వాంఛితప్రదంబుగా
తావకీయ దివ్యనామ తారకప్రభావమున్
దేవ నే నెరుంగజాల దీనరక్ష పాహిమాం॥ 26

భుజంగప్రయాతం॥ సదానిన్ను గొల్వంగజాలగా మహాత్మా
మదిన్నెంచలోకయ్య మన్నించవేగా
బదుల్పల్కకున్నావు భక్తార్తి బాపం
గదే సర్వలోకాధికారా సమస్తా॥ 27

పాదవృత్తం॥ భావమునందున భక్తిని గొల్తున్
సేవకురాలను శీఘ్రము బ్రోవగా
నీవగదా మరి నీవిటు సేయగా
దేవపరాత్పర దిక్కిక గానగా॥ 28

మ. త్త॥ ఎన్నిరీతుల వేడుకొన్నను నేలరావిటు దైవమా
కన్నతండ్రివి నీవియిట్టుల గాసిపెట్టుట న్యాయమా
నిన్నగాక నన్యగొల్వను నిక్కమంచు దలంపుమా
చిన్నదానను నేరమెన్నక శీఘ్రమే దరిజేర్చుమా॥ 29

ఉ॥ ఎన్ని దినంబులాయె నిటు శేలొకొ? మానసముదాల్చి యూరకే
వన్నలయింప న్యాయమగునా సదయుండవిదేటికయ్య నీ
వెన్నడు నిట్లొనర్తువని యెంచగనైతి తంబు దెల్పినా
విన్నపమాలకింతువని వేడెద భారమునీదె శ్రీహరీ॥ 30

తరళ॥ పరమపురుష మొరలువినవా పతితములను వరయకే
కరుణగనవె దొరవుగదవె గనల కినుక సుతుల నీ
చరణకమలములను భజన సలుపదలతు నిరతమున్
హరుడవనరె యఖిలదురితహరణ మనము కరుగదే। 31

మనుమధితి॥ హరసుచరిత్రిం హరినుతిపాత్రిం
మునిమునిస్తోత్రిం సురచిరగాత్రిం
పరమపవిత్రిం భవహరమంత్రిం
దురితలవిత్రిం స్తుతిజనపాత్రిం। 32

మేఘవిలసితశ్యామాత్మగాత్ర పరమపురుషనే

నీపాదంబులె నిజముగ గతియా

నేపాపంబుల నికనరయకుమా

యాపద్బాంధవ యదుకులతిలకా। 33

చ. వ్రతములు నోములాది యుపవాసములింత మహాత్మ్యమంత్రము న

త్క్రతువుల్ యజ్ఞయాగములు దానముధర్మము తీర్థయాత్రలున్

యతులతపా జపంబు మదికద్భుతమైన తపంబులెల్లనే

హితమతిజేయనైతినిక నెట్టులగాతువొ నన్ను దైవమా। 34

శా। ఏవంగాని భవత్పదాబ్జముల సేవత్యంతముగా భక్తితో

నానావేళ మొక్కుచుండుదును నీనామంబు నెంతోమదిన్

నేనింకేమియు జేయజాలనిక నానేరంబులన్సైచి య

త్యానందంబున దాపుజేర్చి కృపనన్నాశీర్వదింపంగదే ॥ 35

పద్మనాభవృత్తం—: శ్రీకాంతనావంత లంతంబుగావించి
శ్రీఘృణిందెసాఖ్యంబు నీయంగరావే
నీకన్ననాకెవ్వ రున్నారురక్షింప
నీరేజపత్రేక్షణా భక్తపాలా!
గైకోవ దేవా! ననుంగావలేవా!
జగద్బాంధవా! బాధలోర్వంగజాలఁ
వైకుంఠవాసా! రమాహృన్నివాసా!
కృపాజాలిలాశా!సు మహేశా నమస్తే॥ ౩౬

భూతిలకం॥ ఎంతని వేడుదు సర్వరంబుననేలరా నీటుదేవ మే
మెంతటివారము యింతనిర్దయ యేలగల్గెను మాపయిఁ
అంతము లేనిభవాబ్ధిమున్గితి నక్కటా! దరిఁజేర్పవే
చింతలు దీరిచి వేగనీపియసేవ కావలెనేలవా। 37

ప్రహేయ॥ ప్రతిదినమును నీపాదాంబుజాబుల్
అతులితముగ నాయాత్మం దలంతుస్
తెలుపుమవగ నీవిశ్వంబులో నం
గతియిక గలదే కారుణ్యమూర్తీ॥ 38

ప్రియకలితం॥ హరిహర నీపదాంబుజంబు లహర్నిశంబులు గొల్తునా
దురితములెంచక రక్షకుండవు దుఃఖవారధి దోయకే
శరణని నీదరి జేరినందుకు జన్మసార్థకమాయటుల్
వరమిడవే నిజదాసపోషక భవాబులెల్ల దొలంగగ॥ 39

మధువిలసిత॥ రావే వేగమె రఘుకులతిలకా
నీవేదిక్కిక నిరతముమరితే
దీవిశ్వంబున నిక నెవరకటా!
భావాతీత కృపనను గనవే॥ 40

వనమయూర॥ నీదగుకటాక్షమిల నిక్కముగగల్గన్
వేదనలుబాయునని వింటిమి మహాత్మా
బాధలిటుగల్గినను బాపవదియేలా
యేది భవదీయకృప యెందుకిటురాదో॥ 41

ప్రహేయ॥ దరిశనమిడుమా ధన్యాత్మసాదన్
పరిపరివిధులన్ ప్రార్థింతు నే నిన్
వరమిడగదవే స్వర్గంబైనన్
నరకమునిడినన్ నాకిష్టమేయా॥ 42

సుముఖ॥ సగుణుడవౌచు జరాచరముల్
యగణితమైన యనేకములన్
సొగసుగజేసి శుభప్రద నీ
వగుపడకుంటి వదేలనొకో॥ 43

వ్రిశ్వా॥ రారనాస్వామి కూర్మికంబుజూపంగ నా
నేరమూ వైరమూ నిన్ను నేగొల్వనా
భారమంచెంతువే భక్తులఁ బ్రోవగా
శ్రీరమానాథ నాచింతలందీర్పవే॥ 44

అంబురుహ॥ నేరమనీవిటు నిర్దయజూపగ నిర్మలాత్మనిరంజనా
పారకునీపద సారసముల్ మనసార భక్తినిగొల్తుగా
లేరికనీవరి దైవముదిక్కిక లేదు నీదరి జేరితిఁ
పారములేని భవాబ్ధినిద్రోయుట జన్మబాధ లెటోర్తునో॥ 145

అచ్యుట॥ తలపరమాధమానవులు తావకనామముని
శ్చలమతినిన్ను గొల్వ సిరిసంపదలిత్తువుగా
కలనిజమంచు నమ్మికడగావని కష్టములఁ
గలుగగజేసిపొందు జగంబు నతంబగునే॥ 46

మాలిని॥ పరమపురుష నాపాపంబులన్ బాపవేరా
హరహరయను నీనామామృతంబే హరించున్
దురితములను యామాధుర్యమా నీజపంబుల్
నిరతము పఠియింపన్ నీవు రక్షింతువే॥ 48

విద్యున్మాలా॥ రావే సీతారామా దైవం
బీవేగావే మీపాదంబుల్
సేవింతున్ భస్మీభూతంబై,
పోవున్ పాపంబుల్ నేరంబుల్॥ 49

కమలవిలసితము॥ మహిపలువెతలను మముబడద్రోయున్
మహితుడవని నిను మదిగొనియాడన్
అహరహము నిను నభినుతి జేతున్
ఇహపరసుఖముల నిగడదె దేవా॥ 50

వసంతతిలకం॥ నాపాలిదైవమిటు నన్నుతరింపజేయం
నాపూర్వపుణ్యమని నామదిలోన నెంతున్
నీపాదపద్మముల నెమ్మిభజింతునింక
కోపంబుబూనకుమ కొల్చెదనీవదేవా॥ 51

మణిగణనికరము॥ పతితములడపెడి ప్రభుడవనుచు ని
న్నతులితముగ భవహరుడనియనరే॥
మతినిటుగొలిచెద మనువిడకికనా
గతి క్షితినెవరిక కరుణనుగనవే॥ 52

స్రగ్వినీవృత్త:॥ ఎంతకాలమాయె నీవిధంబుగా
వంతమానవేల పాడియౌనాకో
ఓంతదీర్చవేల చెంతగాదా నీ
వింతకాఠిచిత్తమేలదాల్తువో॥ 53

ప్రహరణకలితం॥ మనవిని వినుమా మముగృపగనుమా
యనవరతము నీ యడుగులెగొలుతుఁ
గనులను నినునే గనుగొను టెపుడో
క్షణమొక యుగమై గడచును జనకా॥

మానిని॥ ఏమని తెల్పగ నేర్తును నావిధి యెట్టులనుండెనో దైవమవా
స్వామివి నీవని నమ్మితి నీభవసాగరముఁ దరిఁ జేర్పగదే
నీమహనీయగుణంబుల విఁటిని నీసరి లేరని మ్రొక్కితినా
పాముల బాపి శుభంబుల నీగదె భక్తజనప్రియ దండ్రిగదా!

భాస్కరవిలసితం॥

ఎల్లజగములను నెంతయు ప్రేమఁ నేలెదవని బుధులనవిని నే నీ
పల్లవమృదుపద పంకజములనా భావమునను నిరతము భజియింతుఁ

చల్లగననుదయ జూడుము నేనీ సన్నిధినిలువగ నిరతముగోరి

కల్లయుటనిసను గాదనిద్రోయుం గాదగునాగా కరుణను గనుదేవా।

కరిబృంహితము। నాదుజనకుడ నీవునను విడ నాడకే పరమేశనీ

పాదముల మదిలోనగొలిచెద భక్తవరదుడ బ్రోవవే

నీదగలనొక్కశాశ్వతరముగు నేహ్యావిషయసుఖాంబుధిన్

వేదనలబడి వేడితినినిను వేరుగతి గననైతిగా॥ 57

భద్రకవృత్తం। పరమపురుష పావనాశనా

దురితములను ద్రోలవేల నీ

బిరుదములను బ్రీతితోడ నే

మరతువిది సమంజసంబొకో। 58

పృథ్వీవృత్తం। పరమపురుష కృపానిరతిన్

నిరతము గనుమని నిన్గొలుతున్

శరవణమనుచు వేగముగా
వరమిడి వెతల బాపగదే॥ 59

ఉ॥ దిక్కువు నీవు నామదికి జిక్కితివేనియు నిల్వబోవు నీ
వెక్కడివాడవయ్యె యిటులేటికి జేసెదవో యెరుంగ నా
చిక్కులు దీర్పువాడవని చిత్తమునన్ వసియింపుమన్న నా
దిక్కటు జూడవైతి విటుదేవ భవత్కృప యిట్లుమానునే॥ 60

తోదకవృత్తం॥ నాయిలవేల్పవు నాగతినీవే
వేయివిధంబుల వేడితి నిన్నే
హాయిగ దుఃఖము లన్నియు వేగం
బాయగజేయువె పావనమూర్తి॥ 61

మణిమాల॥ రారా రఘువీరా రాకుంటివదేరా
భారంబనదేరా భక్తార్తినిబాపఁ

తేరా యదుదూరా లేదా దయరాదా
నీరాకమొగాదా నిన్వేడగలేదా॥ 62

ఉ॥ ఎన్నఁడుమయ్య నేరముల; నెన్నియొనర్చిననేమి నేను నీ
కన్నుల గప్పిచేసిన యకార్యమదొక్కటియేని గల్గెనే?
నన్నికదూరఁ జేసితి, విదె నాతనువెల్లను నీదెగాదె? యే
తెన్నున నేను బోయినను దేవ! జగత్ప్రభు నీ వెఱుంగవే? ॥ 63

మ॥ అపరాధంబులొనర్చి కావుమన నాథా యెట్లు రక్షింతువం
చపవాదున్ గలిగించి నిర్దయత నన్నారాటముం బెట్టెదే?
నెపముల్ గల్గకయున్న లోకమున జన్మింపన్ మనుష్యాళికిం
జపదాన వ్రతముల్ హరించునవరే సర్వాపరాధంబులన్॥ 64

ఉ॥ ఇన్నిదినాలనుండినను నేటికొ? కష్టములన్ భరింపరా
కున్నను, కావవైతి; వెటులోర్వఁగనేర్తును? దేవ! నేను నీ

సన్నిధి గోరి వేడితిని శక్తివిహీన, నికేమిచేయుదున్
నన్నిక బాధపెట్టకుము, నాయపరాధములన్ క్షమింపుమా॥ 65
శా॥ దుశ్చారిత్రుడు దుర్మదాంధుడు కడున్ దోషాత్ముడే యయ్యు దా
బశ్చాత్తాపమునొంది పూర్ణమతితో బ్రార్థించెనేనిన్ నినున్
నిశ్చింతన్ భవదీయ సన్నిధికిరా నేర్చున్‌గదా వాడు నా
శ్చర్యంబగు దేవ నీమహిమ! నన్నారీతి మన్నింపవే॥ 66
శా॥ ఎందున్నావో పరాత్పరా కనులనే నేరీతి నిన్గాంతునో
మందాత్మన్ మహిమాన్వితుండ వకటా మాకెట్లుగాన్పింతువో
నాదేహంబగుచుండెనయ్య ఇక నీసాన్నిధ్యమందుంచి యా
నందం బొవథమిత్తువో యిడవో హా! నాభాగ్యమెట్లున్నదో॥ 67
శా॥ తృప్తింబొంద దికేమినేతు నిను నెంతేనిన్ మదిన్‌గొల్చినన్
అప్తుండే వెగదయ్య తెల్పుమిక నెట్లానందమున్ గాంతునో

పాత్రంబింతయు మెప్పఁజేని నిను నాభాగ్యంబునం గందునో
వ్యాప్తింబొందెడు చిత్తమయ్యె కృప నావాక్యంబు లాలింపుమా॥ 68
శా॥ వశ్యత్వంబిక కష్టమౌటను నిను నే బాధించినాన ప్రభూ!
సత్యాసత్యమెఱింగి పోఁతువని నీ సాన్నిధ్యముం గోరినా
యత్యంతంబగు దుఃఖమెల్ల నిరుడో యున్నా యెడింగించి కా
నిత్యానందకరుండవీవగుట నన్నిట్లా రక్షింపవే॥ 69
శా॥ నాకోర్కుల్ ఫలియింపకున్న జనకా! నాపాలనీవుండ; నా
కేకష్టంబిక నేలగల్గనగు నాకీవే సుఖంబిచ్చినన్
శోకమ్మున్ నరిగాని యెుండువినుమా లీలాప్రియుండందు నిన్
రాకన్మానున కొన్నిచిక్కులయినన్ రక్షింపు సర్వేశ్వరా॥ 70
శా॥ నీ వేచిక్కులబెట్టుచున్నదిమేలే యాగుం దాన నిన్
సేవింపదగు పిలుగల్గు నది నీచిత్తంబెయైనన్ ధృతుల్

శేవంచున్నను వేడుకొందునిక యేలీలన్ త్వదీయాజ్ఞలన్
దేవా! నాతలదాల్చి యోర్తునిను ప్రార్థింతున్ కటాక్షింపవే॥ 71
శా॥ ఏన్నాళ్లీవిధి యేవవుం బ్రతుకుట న్నీలోకమా దుందు నో
యన్నా! జూడు మొకింత బిల్లలకు చెర్లాటంబె యైనన్ మహా
పన్నంబై మరణాంతకం బెలుకకున్ మాబాధయున్నట్టిదే
మన్నన్ నీవిటు సృష్టి జేయుటలు నీ కానందమై యైనచో॥ 72
శా॥ నాధారంబిక నీదెగాదె జనకా నా కీల యేదింతయున్
నీభావంబది యెట్టులుండు నటుకే నీ వేలుకొమ్మా ననున్
సౌభాగ్యంబులనిచ్చి గైకొనుము నాసాష్టాంగదండంబులన్
సేవానంచు నుతింతు దర్శనమునన్ శీఘ్రింబు నాకీగదే॥ 73
శా॥ స్వామీ! నామది తెల్వినొందిక ధు బశ్చాత్తాపమున్ బొందినీ
పేరిమన్ గాంచగ గోరుచున్నదిగదా వేగంబె యేతెంచి నా

బాముల్ బాపగదయ్య; నాహృదయ భావంబుం బరీక్షింపుమీ
పేమాలిన్యంబునుమానముండినను నీవింకన్ రమావల్లభా। 74

ఉ। నే కడుమూర్ఖనైతి నిను నిర్దయుడంచు వచించియుంటి హా!
వ్యాకులమొందితిన్ జనక! వ్యాధుల గష్టములన్ గృశించుటన్
నీకరుణారసత్వమును నిర్మలప్రేమయు నన్నిమారులో
నే కనులారగాంచియును నేడిటు బల్కితి నన్ క్షమింపుమా। 75

చం। కనులకుగట్టినట్లు జనకా! భవదీయసువిగ్రహంబు నా
మనమునన్నదయ్య కనుమా యనుమానమికేలనయ్య నా
తనువిది నీదెగాదె కడుధన్యుననే నినుగాంచగల్గితిన్
వినుము మరొక్కకోర్కె నిను బిల్చినయంతనె వచ్చుచుండుమా।

శా। అయ్యా! నిన్నిక కష్టపెట్ట నతిదీనావస్థనేనుండ నా
యయ్యాలించిమనోరథంబులిడి నాకుంగల్గు దుఃఖాదులన్

నెయ్యంబారదొలంగఁజేయఁగదవే నీపాదముల్ గొల్చెదన్
వెయ్యార్లిచ్చినవిన్న లోలుసఖుఁడీ విశ్వంబున్ గల్గునే॥ 77
శా॥ విన్నావో వినలేదొ దేవ యిదెనా విజ్ఞప్తి గైకొమ్మ నే
నెన్నో భంగుల వేడుచుంటి నకటా యీరేడులోకంబులం
దున్నాడే నినుఁబోలు దైవ మిక నన్నోదార్పగా రావె నే
కన్నీర్గారగ దుఃఖవార్ధిమునుగంగా నిట్లుపేక్షింతువే॥ 78
శా॥ నీకన్నన్ గతివేఱు లేదుగద నేనీసన్నిధిన్ జేరితిన్
శోకాబ్ధిన్ దరిగానన్నైతి నకటా శోధింపగానెంచినన్
నాకవ్వారికనున్నవారు జనకా నాపాలిప్రత్యక్షమౌనే
నీకారుణ్యముజూపకున్న ధరలో నేనిల్వగానేర్తునే॥ 79
శా॥ నేరంబుల్ క్షమియించి నిల్చిమదిలో నీప్రాపునన్ జేర్చి నా
భారంబున్ దొలగించి సంచితములన్ భస్మంబుగావించి ని

స్మరంబా విషయాదిభోగముల నాసక్తిందొలంగించి యే
యారాటంబులు లేక దేహము ననాయాసంబునన్ బాపవే॥ 80
మ॥ అమ్మా యమ్మ యిదేటికమ్మ కనులందారీతిగా నశ్రువుల్
గ్రమ్మన్ నాకొరకింత కాలమతి దీక్షం బూనగానేల న
రమ్మల్ నేత్రములుంతునింక మది నారాటంబులం బాసి భా
గ్యమ్ముల్ బొందుము బిడ్డవో కనులఁగా పాదుఁదఁచాడవే । 81
మ॥ అపరాధంబొక యింత లేదు సుత నీయందెట్లు గల్గున్ మహా
జవదాసవ్రతశీలవీవు నినునా సాన్నిధ్యమందుంతు నీ
కపవర్గాదిసుఖంబులెల్లనిదు దేవ శ్రాంతమున్ బ్రోతునం
చిపుడే నాదుకరంబులెత్తి నినుదీవింతున్ మదిన్నమ్ముమా॥ 82
శా॥ దేవా! నీవిటులింత చెప్పినను నా దేహంబులేకీతి నా
భావంబందుదొలంగు? గాన యిపుడే ప్రత్యక్షమై నిన్ను నే

బోధింపనేర్తు నటంచు కరుణాపూర్ణుండవై తెల్పి నా
వేదల్ గైకొని చిత్తగించి మనవిన్ శీఘ్రంబె రక్షింపవే॥ 83
మ॥ ఇపుడే దర్శనమిచ్చి బ్రోవగదవే యీశా! మహేశా! నమో!
చపలత్వమ్మున నిన్నినాళ్లు గడచెన్ చాలింక నే నొల్ల నీ
భవసంసారపు బాధలెల్ల నకటా సంతాపమున్ జెందితిన్
ఎపుడే తెంతువొ నిన్ను గాంచక నేనీలోకమందుందునే॥ 84
శా॥ వమ్మంజాల నికెల్ల నీదు నుడులా నావల్కులాయంటి కో
పమ్మింకేనియు జెందబోక కరుణన్ ప్రత్యుత్తరంబిచ్చి రా
వమ్మా యంచు కటాక్షవీక్షణములన్ యానందమున్ గూర్చి నా
పై మ్మాద్కి నిను నిల్పనేర్తు మదిలో నీశా యెఱింగింపవే॥ 85
మ॥ జనకా! నీవె మదీయ నాల్కకొనపై సంప్రీతితో నిల్చి నా
యనుమానంబును దీరిపోవునటు లాహా! యెంతయో ప్రేమ నా

మనవుల్ దీర్చెద శేషిపోని వరముల్ మానంగ దేయుంచు నీ
వనవే! యిట్టిది నిశ్చయంబుగదవే యాం దనృతంబున్నదే। 86
శా॥ తోలుంగన్నులతోడ నిన్నుగనుటల్ దుర్లభంబౌటన
న్నేలాగో మదిగోంత తృప్తినిడగా నీరీతిగన్పించితే
చాలుంజాలు భవత్కృపారసమునన్ సంప్రాప్తనైతిన్ భళీ
బాలా! నిన్నికఁజేరితునంచు దెలుపన్ బ్రత్యక్షమైనావహో। 87
మ॥ తెలితూంజాలక పల్కినానుగద యోదేవేశ! నాయందు నీ
వలుకన్ దాల్చుటయెన్న జేని మదికిన్ యారాటమున్ బెట్టితే?
కలుగంజేసిన కీడదొక్కటయినన్ కన్నారగన్నారమే
కలుమంబై మది నీదునాజ్ఞ దొరగన్ కష్టాలు రాకుండునే। 88
మ॥ అదియిమ్మా యిది యిమ్మటంచు నినునే నాయాసమున్ బెట్టితిన్
మదినూహింపగనైతి నీదు కరుణన్ మమ్మెట్లు రక్షించితిన్

సదయా! తృప్తిగ నోఁకింత లేక చెడితిన్ సర్వాపరాధంబులన్
ఇదిగో నీదు పదారవిందముల సాన్నిధ్యంబునం దెల్పితిన్
గద నీ వేమనుకొన్న గాని యిఁక నీకారుణ్యమున్ జూపవే॥ 89

శా॥ సంతోషించితి నమ్మ లెమ్మ సుతనీ సద్భక్తికిన్ మెచ్చితిన్
సంతేనిన్ భయమొందకమ్మ నినునే శోధింపగా నెంతునే
చెంతం జేర్తు దుఃఖమిత్తు మదిలో చింతన్ దొలంగింతు నీ
సంతాపంబిఁక నేటికమ్మ వినుమా సత్యంబు ముమ్మాటికిన్॥ 90

మ॥ శివుడే కన్పడి తెల్పె నిన్ను నిఁక రక్షింతున్ సుతా యంచుహా!
శ్రవణానందకరంబుగాగ నిఁక నాజన్మంబు ధన్యంబుగా
భువినా పుణ్యఫలంబులెల్ల నివుడే పూర్ణంబు నొందెన్ గదా
యెవరింకేమి యొనర్తురో యనుచు నేనేలా? భయంబందగన్॥ 91

శా॥ ఈశుండే కరుణార్ద్రచిత్తమున నన్నీవేళ రక్షించి దు
ర్లక్ష్యంబుగ దోలగించునంచు బలికెన్ కించిజ్జ్ఞునైనన్ మదీ
యాశం దీర్త్తు నికేటి చింతయని నన్నాశీర్వదింపంగ నా
వేళంబై మది కాయినాండె సుదినంబాగా దినేడంతయున్॥ 92

మ॥ సెలవా! మా॥ దేవ దేవ! మదిలో చింతం దొలంగించి నీ
యలుకన్ మాని మనోరథంబులిడి నాకానందమున్ గూర్చితి
విలలో నీవరి దైవమెవ్వరిక నోయీశా నమస్తే నతే
వలుమారివ్విధి నన్ను గాల్తువిక నా ప్రారబ్ధమున్ బాపవే॥ 93

మ॥ భవదీయంబగు దివ్యదర్శనము చే బాలా! భయంబేల ని
న్నవలీలన్ దరి జేర్తునంచు కరుణాయత్తుండవై పల్కి యీ
భవబంధంబుల బాపి బ్రోవగదవే బాధింపగా బాలుడీ
వెవరున్నారు? దయాంతరంగుడవు నీవే యిట్లుపేక్షించినన్॥ 94

శా॥ నాపాప్రత్తంబది యెట్టులౌనో యనకా నాకేమియుందో చద
రయ్యా! ప్రారబ్ధము దెట్లు వీడు నకటా యౌదార్యవారెవ్వరో
యేపాప్రద్ధున్ని నెనమ్మి గొల్తునిక నాకే వాంఛయున్ లేదుగా
నీపాదామృతముక్త యింత యిటు రానీయంగ నేగోరెదన్॥ 95
ఉ॥ విస్మయమానునిన్ను మది వేడినయంతమహాపరాధముల్
క్షమము జేయనేర్తువని పల్మరువింటి భవత్ప్రభావమున్
అస్మద మోహదుష్కృతము లారయనేలకృపాంతరంగ! నే
నీస్మరణామృతంబె మది నిచ్చలు గోరెద నన్ క్షమింపవే॥ 96
శా॥ భాగ్యాపాయము పోవనైన విని నీ పాదారవిందంబులే
ప్రాణాధారకరంబులౌట నిరు నే ప్రార్థింతు సర్వాంగముల్
క్షీణత్వంబును బొందనీక కరుణాసింధూ! కటాక్షించి న
త్రాణన్నాకు వనుగ్రహించి తనువర్గ ధన్యత్వ మొందింపవే॥ 97

శా॥ పాపంబుల బాపరా యని కరుణ న్నాకొ ల్చాలింపవే
నీపాదంబుల నాశ్రయించితిగదా నీవేమిగావించినన్
నాపుణ్యంబని యెంతునయ్య వగవన్ నాకర్మమెట్లుండునో
యాపద్బాంధవ పాహిమామ్మనుచు నిన్నాశ్రితముగా వేడదా।
మ॥ ఇతరుల్ రాతగ దోచనయ్య నను నెబ్బంగిన్ దరిం జేర్తువో
మతిలో నమ్మతిలేని వ్యర్థముగు జన్మంబేల కల్గించితో
క్షితి నీచర్య లెరుంగనేర్తునా నీ చిత్తంబదే మోగదా
గతియుం గేమి యొనర్పనెంచితివా నా కష్టాలనీడేర్తువో। ౯౯
మ॥ విషయంబుల భవత్పదాబ్జముల నీవిశ్వంబులో నింక నే
గడియైనన్ విలువంగజాల నిపుడే కన్నారగన్పించి నా
యెడుపల్ బాపద నమ్మటంచు కృప నాయుష్షార మీడేర్చినన్
కడకంటన్ మరియొక్క మారుగని కాంక్షల దీర్పవే మ్రొక్కెదన్।

శా। స్వర్గంబున్ మఱి మోక్షమున్ వలదు జీవంబుల్ ననుంబాయుచో
దుర్గానాథ! మదీయవిన్నపము నీతో నాం చెఱింగింతు సం
వర్గంబుల్ దొలగించి దైహికప్రవాంఛల్ వృద్ధిగానీక స
న్మార్గాయాసము బొందనీయక యుష్మత్సన్నిధిం జేర్చవే। 101

---

ఓం.




# భక్తిరసామృతము.

సాంబశివుని నామో
పాసనమనిశంబొనర్తు భక్తిని స్నే
గాసియు జెందగనీయక
దోసములెంచకయె కరుణతో నను బ్రోవన్। 1

క॥ సాంబసదాశివ! నీపా
దాంబుజములె మదినినిల్పి యనవరతము స
త్యంబుగ వర్తింపగ సా
యంబై దయబ్రోవగదవె యత్యంతకృపన్। 2

క॥ శ్రీకరము నీస్మరణం
బేకద యిహలోకబంధ మెడపగ, నికనో
లోకేశ! నీకుమ్రొక్కెద
నాకొని నావందనముల, గావవె కరుణన్॥ 3

క॥ ఈశ్వర! నినువేడెద పర
మేశ్వర నేరములసైచి యిక నీకృపచే
శాశ్వత మోక్షంబిడి యీ
విశ్వములో వెతలవేగ విడచేయగదే॥ 4

క॥ మా వెతలబాప భువిలో
నీవేగద యొరులుగలరె? నిఖిలాధీశా!
రావే సజ్జనరక్షక!
ప్రోవవె కరుణాలవాల పుణ్యసుశీలా॥ 5

క॥ సత్యవతి, నిన్నుదండ్రిగ
నిత్యంబును వేడుగాన నిర్మలకృపతో
బ్రత్యక్షమైన జాలును
సత్యధికం బేమి గోరనైతిని తండ్రీ॥ 6

క॥ పరమేశ! మిమ్ము భక్తిని
నిరతము ధ్యానించుటకును నిర్మలబుద్ధిఁ
బరగుచు సద్గుణముల నిడి
పరిపూర్ణ కటాక్షముంచి పాలింపఁగదే॥ 7

క॥ సత్యస్వరూప మిమునే
నిత్యంబును వేడుదాన నీపదసేవఁ
అత్యంత భక్తిశ్రద్ధల
సత్యము శాంతాది సుగుణజాలము నిమ్మా! 8

క॥ వదలక మీచరణంబుల
గదలక నామదిని నిల్పగలిగెడి శక్తిన్
చెదరనిభక్తిని ముక్తిని
సదమలమతి నిమ్ము వేగ సద్గురుదేవా॥ 9

క॥ భరియింపజాలదేవా
భవజన్మ జరామరణ వెతలలో నికనన్
వెరపగుచున్నది బ్రోవవె
బరువగు సంసార మిలను భరియింప నెటో॥ 10

క॥ మీపాదభక్తినేమది
నోపావన గోరుదాన నొప్పగ నికనన్
పాపాత్మయుంచు నెంచక
కాపాడవె దీనరక్ష! ఖలజన శిక్షా॥ 11

క॥ అరమర చేయఁగ నేటికి?
ధరణి ననిత్యములుగావె తనువులు దేవా
శరణాగతిగాదె యిక నీ
దరి చేరిచి కరుణనేలు తండ్రివి గావే॥ 12

క॥ బంధనల జిక్కినావని
సందేహింపంగనేల జనకా నిన్నే
డెందమున నమ్మి గొల్చెద
నెందుంటివో? నన్ను బ్రోవవేటికొ దేవా॥ 18

క॥ ఎందున జూచిన నీవయి
నందే లేకుందువంచు జాలగ భువిలో
నందురుగద యోసదయా
యెందుకు నాకిటుల గోచరింపవు? తండ్రీ॥ 14

క॥ గతినీవకాదె దాసుల
పతితములెడబాపి బ్రోవ పరులెవరింకన్
సతతము నిను నమ్మితి స
ద్గతి నొసగుచు బ్రోవరావె కారుణ్యనిధీ॥ 15

క॥ అంతశ్శత్రుల వేగమె
యంతము నొందించగల్గు నతిధైర్యంబున్
శాంతాది సద్గుణంబుల
సాంతంబుగ నొసగు చిన్ని సత్యుని తండ్రీ॥ 16

క॥ నినునమ్మితి నినువేడితి
నినుగొల్చితి నిశ్చయముగ నీవేగురువా
దనఘా! నీవే వారుడవు
తనయును సద్గతిని జేర్చి దయబ్రోవగదే॥ 17

క॥ భావము నందెల్లప్పుడు
పావనమగు నీదునామ పఠనము సేయం
గా వసుధగల్గు కష్టము
లావంతయు నంటకుండు వరయగ దేవా!॥ 24

క॥ కష్టంబుల బడనీయక
యిష్టంబుగ నన్నుఁ బ్రోవు మీవరద! కృపా
దృష్టినిగని, యెవ్విధమున
భ్రష్టనుగాకుండ జూడ బ్రార్థింతునిన్నున్॥ 25

క॥ మాయయని తెలియజాలక
హేయము లీవిషయవాంఛలే నిజమంచున్
బాయక పాయిని బాసితి
శ్రేయస్థితి నొసగి ప్రోవు శీఘ్రము తండ్రీ॥ 26

క॥ వినయముతో వేడెద నిను
కనుగొన కష్టతను నేను కావించినయే
ఘనమగు తప్పుల మదినిడి
కొని కఠినతబూనకయ సుగుణముల నిమ్మా॥ 27

క॥ దయ నను బ్రోవగరాదే
ప్రియసుత విటుబాసియుంట ప్రీతియె? గుణ
త్రియమెటుబాపెదొ తండ్రీ
భయమయ్యె దయాతిసాంద్ర! పరమ మునీంద్రా! 28

క॥ చింతలు దీర్చెదవని నీ
చెంతను జేరితిని నన్ను శీఘ్రమె బ్రోవన్
పంతము బూనగ బాడియె
పంతనముగ బ్రోవదగిన సమయము గాదే॥ 29

క॥ కలిమిని తనువును నిఖిలము
జలబుద్బుదమంచు విడువజాలక యకటా
యిల పలు వలలం దగిలితి
నల పరిపూర్ణము పదవి నందింపగదే॥ 30

క॥ పాపంబుల జేసితినను
కోపంబున నన్ను పాప రూపంబగు యీ
భూవనమున బడద్రోయక
కాపాడవె దీనరక్ష! ఖలజన శిక్షా॥ 31

క॥ మిము నెవ్వడు మది వేడిన
క్రియలన్ని వహించి మోదజనకంబౌ మో
క్షము పొందెదరని వింటిని
మము బ్రోవగ వేగరావ మద్గురు దేవా॥ 32

క॥ నీస్మరణ చేసినంతన
భస్మముగావింతు వీవు భక్తులబాధల్
విస్మయముగాదె? జనకా!
అస్మదఘవినాశ యీశ యఖిలాధీశా॥ 36

క॥ సారవిహీనంబగు సం
సారమె తిరమంచు నమ్మి శ్రమలొందుచు నే
సారితి నిక నీదరికిం
చేరితిని బ్రోవరావ! శ్రీ సాంబశివా!॥ 27

క॥ పరమేశ్వర! కరుణాకర!
దురితంబులబాపి బ్రోచుదొర నీవుందగా
పరితాప మొందనేటికి
శరణార్థిని దిక్కునీవె సరగునరావే॥ 38

క॥ ఇదియేమి చిత్రమోగద
మదినీవే దిక్కటంచు మానకభక్తిన్
సదయుడవగు నిను నమ్మియు
వదలని వెతలొంది కుందవలసెను తండ్రీ॥ 39

క॥ ఓదేవ! బ్రోవగానీ
వే, దీనులపాలిదిక్కు వేరిక గలదే
నీ దాసురాలనేగద
నీదయ నాపైనరాదె నిఖిలాధిపతీ!॥ 40

క॥ ఎక్కడనుంటివొ జనకా
మక్కువతో నిన్నుజేరు మార్గమెరుంగన్
గ్రక్కున బ్రోవుమనన్నిటు
చిక్కులు బెట్టంగనేమి జేసితి, జెపుమా॥ 41

క॥ శ్రీగౌరీ! నీమదర్పిత
వేగారి నీసుతుల నెటులు బ్రోతువొ? నీ
వేగతి భక్తులకౌరను
వేగము దరిజేర్పవమ్మ వేదతల్లీ!. 42

క॥ అనుమాన మేటికమ్మా
మనమున నీ నామస్మరణ మానముసుమ్మా
నినునమ్మి నారమమ్మా
ఘనముగ రక్షింపుమమ్మ కరుణనుతల్లీ!. 43

క॥ జననీ! నీకైనను నీ
తనయులయెడ జాలితెదె! తండ్రియుమాపై
కనికరములేక విడినను
జననే నీవిట్లుచేయ? జగతిని తల్లీ. 44

క॥ పుట్టుచు గిట్టుచు ధరనే
నిట్టుల శ్రమలొందుచుండు టెరుగవె? ననుజే
పట్టి దరిజేర్పవైతివి
యెట్టులనేనోర్తు? వెతలనికనో తల్లీ!. 45

క॥ నీతనయుల మోహమ్మున
మాతప్పుల నెన్నకింక మన్నించుమనీ
వేతలిదండ్రియు గద మా
మాతా! నీసుతులమాట మరువకుతల్లీ. 46

క॥ అవివేకమున నెఱుంగక
భవ బంధంబులకు జిక్కి బాధల బడుచున్
భువిజన్మ మెత్తుచుంటిని
భవదీయ కటాక్షమున్న బాయవె? తల్లీ॥ 47

క॥ దిక్కులు పెట్టకుమమ్మా
మిక్కిడ పోయమ్మ మాదు మొరలను వినుమా
దిక్కెవరో యమ్మానీ
వెక్కడ నున్నావొ గాని యెరుగము తల్లీ! 48

క॥ ఓకాత్యాయని భగవతి
నాకేమి భయంబు నిన్ను నమ్మిన వెనుకన్
నాకాయము నాయాత్మయు
నీకే యర్పించితమ్మ నిజముగ తల్లీ! 49

క॥ దోసము లెన్నియొ నెరుగక
చేసితి నిపుడుడిగి యోగి చింతించితి నా
యాసము చెందితి వెతలను
వేసరి నీకిట్లు విన్నవించితి తల్లీ. 50

క॥ కలవా! నాపాలిట రా
గలవా సమయంబునెఱిగి కాపాడగనీ
గలవా గలకోర్కెలం నీ
విలలేవా? మాకు ముక్తి నీవా తల్లీ. 51

క॥ చిన్నతనంబున నేరము
లెన్నెన్నో చేసియున్న నేటికి? నేని
సన్నిధి చేరితి నేటికి
మన్నింపవె దిక్కునీవె మాకికతల్లీ. 52

క॥ మొరలను వినవో? సకలము
నెఱిగియు నను వెతలబెట్ట నెంచితివో యీ
గిరిరాజతనయ నీవిటు
లరమర సేయంగ న్యాయమా నే తల్లీ. 53

క॥ వృజినంబుల నెడబావవె
భజియించెద నీదు పాదపద్మము లెదలో
నిజభక్త వరులనేలఁగ
రజతాద్రిని నుండనేల? రావే తల్లీ. 54

క॥ ఇలనీకన్నను వేరే
గలరే? నినునమ్మువారిఁ గాపాడుటకై
పిలిచిన రాకుంటివి నీ
పలుకే బంగారమాయె పరులకు తల్లీ. 55

క॥ దీపపుకాంతిని నొకటి
రూపము లేకెటులలోపు చూచిగనటులే
పాపులగ నీదయగల్గిన
పావనులన్నన్న దొలఁగుదువనిని దల్లీ. 56

క॥ అతులితమగు నీభక్తిని
పతితములు నశించి మోక్షపదవియు గల్గున్
మతినిన్ను గొల్తుఁ బ్రోవవె
ప్రతియెవ్వరు నీకు పతిత పావనితల్లీ. 57

క॥ క్షితిపై క్షణభంగురమౌ
బ్రతుకని వివరింపలేక భ్రాంతికిలోనై
వెతలొందుచుంటి వేరే
గతిలేదిక కనులగాంచి గావుముతల్లీ. 58

క॥ తనయును నేనిను వేడగ
సనుమానించెద వదేల? నమ్మా నీకే
కనికరము లేకయుండిన
జనమునకింకెట్లుగల్గు దయ్యావతల్లీ. 59

క॥ నీవైన జెప్పకుండిన
నేవిధి నను బ్రోవగలడా? యేమరినాడో
నావిధియెట్లుండెనో నను
బ్రోవగ నింకెవరుగలరు పుడమిని తల్లీ. 60

క॥ లోపా లోపములున్నను
గాపాడవె నన్ను వేగ కరుణను తల్లీ
యేపాప మెరుగనమ్మా
నీపాదములాన నిన్ను నే విడగలనే 61

కం॥ జీవా! హరుని భజింపగ
రేవా? నుంచైన బుద్ధిలేదా? యికనీ
కీ విశ్వమందుదాతయు
దైవంబును వేరుగలరె? దరిచేర్పుటకున్. 62

క॥ మనమా! నాదొకమనవిని
వినుమా! యిహలోకవాంఛ వీడుమభువి నెం
దున సౌఖ్యమేమిలేదని
గనుమా దైవంబుకన్న గతిలేదనుమా. 63

క॥ శాంతము సద్భూషణమా
శాంతము విడనాడ సకల సౌఖ్యములుడుగున్
శాంతస్వరూపులౌ మును
స్వాంతులె సర్వేశు బొందజాలుదు రవనిన్. 64

క॥ మరణంబు తప్పదెన్నడు
ధరణి ననిత్యములుగావె? తనువులు గానన్
అరనిమిషమైన నెప్పుడు
పరమర చేయంగగూడ దాత్మజ్ఞులిలన్. 65

క॥ తెలిసియుఁ దెలియని నరులిల
నలిఁగెడి నిందలకు వెరక సత్పథమున ని
శ్చల ధైర్యమూని శ్రీహరి
గొలిచెడి సజ్జనులు పరముఁగొందురు మనమా! 166

క॥ పరమాత్ముని ధ్యానించిన
నారూపముతోడ దర్శనంబిడు శ్రీమన్
ఏ రుచులకన్న శ్రేష్ఠం
బీరుచియే యంచు భక్తి నెరుగుము మనమా! 67

క॥ అగణితముగ బోధింతుము
భగవంతుని బూర్ణమైన భక్తిన్ నరమున్
దగు నిర్మల భక్తియె కలి
యుగమున మోక్షంబునొంద నుత్తమపథమా. 68

క॥ సంతోషమూరె జనకా
స్వాంతంబున లేకనీవు సత్కృపతో నా
వంతలబాపుచు నుంటివి
యింతటి కరుణాకటాక్షమెటుకగల్గున్. 69

క॥ దేవా! నమ్మోక్షమువా నిను
సేవింతును కరుణతోడ శిక్షింతువొకో
నీవారుగని దేమున్నది
కేవిధి జేసినను నాకు నిష్టమెతండ్రీ. 70

క॥ కటకటదైవమ! యికనా
కెటుజూచిన బంధనంబె యేమొనరింతున్
పటుతరమగు కృపనేలుము
మటుమాయంబౌనుగాదె మాయాభ్రాంతుల్. 71

క॥ కష్టంబుల బెట్టుట నీ
కిష్టంబైయున వానికెటికి వెరువక్
స్పష్టంబుగ చెప్పెదనే
నష్టంబునులేదు నిన్నునమ్మిన వెనుకన్. 72

క॥ భగవత్స్వరూపమునని
జగతీస్థలి సర్వభూతజాలములోనన్
దగ నివసింతువుగాదే
నగుణుడవని నీకు సేవసల్పెదతండ్రి. 73

క॥ ఏటికి నాకీతనువిది
బూటకమేగాని నిల్వబోవున సతముగ్
మాటికి నినువేడెదనే
నాటికి నీకనులగాంచి నన్నేలెదవో. 74

క॥ పంతనివేడిన నీదయ
సుంతయు నాపైనరాదు చోద్యముగాదే
యింతటివాడవనుచు నా
స్వాంతమునం దెన్నడెరుగజాలను తండ్రీ. 75

క॥ నాలోపంబుల నెంచక
మీలోకంబునను జన్మమెత్తిన దాదిగ్
జాలనొనర్చిన నవి యివు
డేలా? యఘహరుడవౌట నెఱిగితి నిన్నున్. 76

క॥ వెతలెన్ని గలుగనున్నను
మతిలో నీస్మరణ జేయుమాత్రనె నాపై
నతులితమౌ కారుణ్యా
మృతమును గురిపించితో వనేతువుదేవా. 77

క॥ యమబాధ లడఁపుమని యా
సమయంబున నిన్ను బిల్వ జాలనొ గలనో
క్రమమే నేనెఱుఁగుదునో
క్రమముగ నిన్నిపుడె గొల్తుఁగావవె కరుణన్. 78

క॥ ఏపని చేయుచునున్నను
నీపద చింతనము విడను, నిజముగ నాకే
యాపద గలుగగనున్నను
నీపూర్ణ కృపాకటాక్ష నియతిని దొలఁగుఁగా. 79

క॥ సంసారము నిస్సారము
హింసా రూపకమటంచు నెఱిఁగియు భువినీ
సంసారులెల్ల పాప
ధ్వంసుని సర్వేశునిన్ను దలఁపరుగాదే. 80

క॥ నీసాన్నిధ్యము గోరితి
వేసారితి నిన్ను చాలవేడితి నైనన్
గాసిలజేయుచు నన్నా
యాసము బెట్టంగ న్యాయమగునే జనకా. 81

క॥ నాకొఱత దీర్పవైతివి
యేకోర్కెల నింకగోర నేటికివృథగా
నీకరుణ లేకయుండిన
నేకార్యంబైన గాని యీడేరునొకో. 82

క॥ విఖ్యాతయశుడ నీతో
సఖ్యమునని నరుడు ముక్తి సాధింపఁడొకో
సౌఖ్యంబు లింక గోరను
ముఖ్యంబౌ కోర్కె యొకటె మోక్షంబిమ్మా. 83

క॥ నీ యిష్టముగాకుండిన
నే యంశంబైనగాని యేవిధినైనన్
జేయంగా శక్యంబే
నామొర బ్రీమగాక యేమనగ్గును తండ్రీ. 84

క॥ ఓ జగదీశ్వర నాకీ
నిజన్మంబునకు సౌఖ్యమెట్టుల గల్గున్
పూజింతునయ్య నిను ని
ర్వ్యాజకటాక్షమున బాధ లడగింపగదే. 85

క॥ మోహాపేక్షను నేనీ
దేహంబున జేరించు భావింపక నీ
రక్షించిన శిక్షించిన
నీకే నిన్నేభజింతు నెప్పుడు హరీ. 86

క॥ నిర్మలభక్తిని నిన్నా
ధర్మార్థ సుఖంబులెల్ల దానన గల్గున్
చర్మాంబరధర పుర్వాకృత
కర్మలనడచావ కరుణ గలదో లేదో. 87

క॥ కలదో లేదోయని మది
దలచితినని తప్పుగాగ దలపకు దేవా
అలనా శిఖరాజేందుడు
కలదో లేదో యటన్న గావవె కృపతో. 88

క॥ నీవే దైవమ్మనను
భావమునను నిన్నునమ్మి భజియించెదు నీ
సేవకుల కోర్కెదీర్పగ
లేవో శోధించుటయును లీలయొ నీకున్. 89

క॥ తనువున విన్నమువినను
మనమున నెంచంగలేఁడు మరియొకకీర్తిన్
వినుమని నెఱుగని నీవిటు
కను మరగితివేల బ్రోవఁగలిగియు దేవా. 90

క॥ రోషంబున నంటినా నం
తోషంబున నంటినో బదులువల్కవు నా
దోషంబు లెన్నదగ వను
బోషింపఁగరావె పుణ్యపురుషా శ్రీమన్. 91

క॥ సర్వాపరాధములకును
సర్వేశ్వర! కేలుమొగిచి సాగిలఁబడుదే
ఉర్వీని దాసుని తప్పులు
శర్వా! దండంబుతోడ సరియగుననరే. 92

క॥ ఎవ్వఁడు నిన్నఁగొలుచుట
యెవ్వనికై కాదు దేవ నీకృపకొఱకే
తవ్వులి కోటికి వెదకెదు
నివ్వెఱ జెదలంటునొక్కొ నిర్మలరూపా. 93

క॥ ఎన్నోరీతుల వేడితి
నన్నియు జెడచెవిని బెట్ట నర్హంబగునే
యున్నాఁడో లేఁడో యని
నిన్నరుగని వారలందురి నిజముగ న హరీ. 94

క॥ ఉన్నాఁడో లేఁడో యని
మున్నొక భక్తుండు బల్కె మోహంబిడు వే
వన్నెల వెతలబెట్టదు
యున్నావని నిన్ను నమ్మియుంటిని దేవా. 95

క॥ కన్నన బ్రోవగ లేవే
నిన్నమది గొల్తునయ్య నీవేగతి యా
పన్నుని నేమ్రొక్కితినో
యన్నా! నన్నేలకున్న నన్యులు గలరే. 96

క॥ యెన్నో కష్టంబులురా
నున్నవి నాకనుచు దోచుచున్నది మదిలో
యన్నా నీకృపయున్నను
వన్నియు విడిపోగ మోక్షమందగలేనే. 97

క॥ మానవమా! నిరువకుమా
కానున్నది కాకపోన కర్మానుగతిన్
రానున్నది రాకుండున
ధ్యానింపుము యీశునతని దయతో నేలున్. 98

క॥ అవతారంబుల దాల్చితి
వవనీభారంబుదీర్చి యార్తులఁబ్రోవన్
భువనత్రయముల నీవరి
యెవరింక, భవన్మాహాత్మ్య మెఱుగంగల మే. 99

క॥ నావారనువారవదగువా
రేవారును లేరు బుద్ధినెఱుగక చెడితిన్
నీవే నా వాడవు నా
కీవే సర్వార్థములును యిహపరసుఖముల్. 100

క॥ జగతిని ధర్మంబెప్పుడు
దిగనాడి జనంబులెల్ల తెగనీల్గుదురో
జగముద్ధరించనప్పుడె
యుగయుగముల జన్మమొందుచుందువు దేవా. 101

క॥ మర్త్యార్గవర్తులై స
త్కర్మలవిడి జనులు నిన్నగనలేనితఱిన్
నిర్మల కృపతో భువి స
ద్ధర్మము నెలకొల్ప జన్మదాల్తువు దేవా. 102

క॥ వరమిమ్మా దేవా నే
పరమానందంబుతోడ పరలోకమునన్
చిరసుఖముల బొందియు తుది
జరయు మృతియు బాసి నీసన్నిధి జేరన్. 103

క॥ వరమీవే దేవా నే
మరణావేదననునిన్ను మఱవక నీదా
స్మరణామృతమే గ్రోలుచు
నిరయంబును దాటితుదిని నిన్నే జేరన్ 104

క॥ దేహేంద్రియములు పడలక
సాహసమున తిరుగుచున్న సమయమునందే
ఊహాపోహలు దొలగుచు
మోహంబునబడక మున్నె మోక్షంబియవే. 105

క॥ సాహంబనినను జేరితి
దేహపటుత్వంబు నాకు దీరకమున్నే
శ్రీహరిహరరూపా సం
దేహింపక నీదుసన్నిధిని జేర్పగదే. 106

సంపూర్ణము.

---

ఓం.

# భక్తిరసామృతము.




క॥ కైలాసవాస గౌరీశయీశ
నిత్యమంగళదాయకా నీకుశరణు
శ్రీమహాదేవ నీపాద సేవకులము
సర్వలోకైకనాయకా శరణు శరణు. 1

గీ॥ భువనముల నెల్ల పాలించు పుణ్యమూర్తి
పరమభక్తులపాలింటి భద్రమూర్తి
సకల కల్యాణగుణమూర్తి సాంబమూర్తి
నీకరుణచే మమ్ము రక్షించుగాక. 2

గీ॥ చంద్రశేఖర నిన్నాత్మయందు నిల్పి
నిత్యమూన క్తితోడ ధ్యానించునటుల
భక్తిశ్రద్ధల నీగదే పరమపురుష
యివియె నాయీప్సితములవి నీయరేవె. 3

గీ. చంద్రశేఖర నీదివ్యచరణములను
నమ్మి దిక్కునీవనియున్న నన్నుబ్రోవ
రావె దీనుల రక్షించు రక్షకుడవు
తనయుపైనింత చలమూన దగునె నీకు. 4

గీ॥ నీలకంఠ నాదు నేరంబులెన్నక
కరుణతోడనన్ను గావుమయ్య
కూతురిచటనైన గుణవతి గాకున్న
తండ్రిబాయునొక్కొ దయ దొలంగి. 5

గీ॥ చిన్ననాటనుండి యెన్నెన్నో విషముల
నిన్ను వేడుచుంటి కన్నతండ్రి
నీవెనాకులోను నీడయు నిఖిలంబు
దిక్కునీవె గావె? దేవదేవ. 6

గీ॥ సకల సౌఖ్యంబులొసగు రక్షకుడ వీవె
పెక్కుదిక్కుల బెట్టినను దిక్కునీవె
దయను నను బ్రోవకున్నను తండ్రి నీవె
పట్టియున్నాను నీపాదపద్మములను. 7

గీ॥ అన్ని సౌఖ్యంబు లిమ్మంచు నడుగ లేదు
కోరికల దీర్పుమని వేడుకొనగ లేదు
కోరితిని నిన్ను నామనసార నొకటి
సుతులమని మమ్ము నీప్రేమ జూడుమయ్య. 8

గీ॥ అన్నిసౌఖ్యంబు లిమ్మంచు నడుగనేల
అనఘ! మాకన్నతండ్రివే యగుదువీవు
గాన నిన్నేమి మేమడుగంగవలయు
నెరుగవో? తండ్రిబిడ్డలందిడెడిప్రేమ. 9

గీ॥ స్వామి నీయందు భక్తి విశ్వాస మిచ్చి
దయను సాక్షాత్కరించిన దనివితీరు
ధన్యురాలనౌదును తండ్రి తనయుపైన
నింతమాత్ర మనుగ్రహామేలరాదో? 10

గీ॥ ఈశ! నీ చిన్నితనయను బెంచియుంటి
నాపదలనెల్ల గరుణతో బాపుమంటి
సతము నీపూర్ణకృపలేక వెతలగంటి
నన్ను రక్షింపు మీశ! నిన్నమ్మియుంటి. 11

ఆ॥ నీవు కన్నతనయ నిను గాంచగోరిన
చూపొసంగవేల? పాపహార
పతితపావనుండు భక్తవత్సలుడన్న
బిరుదముండునైన నెఱుగవొక్కొ. 12
గీ॥ అచల పరిపూర్ణ సమ్మోద మందజేసి
తుచ్ఛవిషయంబులందాశ దొలగజేసి
జరయు మృతిలేని శాశ్వత సౌఖ్యమిచ్చి
మోక్షసామ్రాజ్య పదవిమ్ము ముదముతోడ. 13
గీ॥ సాధుపోషకుడనుపేరు సత్యమైన
మూడుజగములకును నీవె మూలమైన
నార్తులనుబ్రోచుటకు నీవె కర్తవైన
నన్ను రక్షింపకుండుటే న్యాయమయ్యా?. 14

గీ॥ రాముడట లంక నిన్వేడి క్షేమమొందె
వల భగీరథుఁడునుగొల్చి ఫలముగాంచె
పార్థుఁడును నిన్నునమ్మి కృతార్థుఁడయ్యె
తనయునోనన్ను బ్రోవంగ మనసురాదె
భవ్యలోకేశ సర్వేశ భవవినాశ! 15

గీ॥ వలదు వలదన్న వాంఛల న్వదలబోదు
విడువు మిడుమన్న దుర్బుద్ధి వీడబోదు
తలపు నీపై నిలుపుమన్న నిలుపబోదు
అయ్య యీమది చర్యలేమందునింక. 16

గీ॥ అన్యవిషయంబులందు మోహమున సతము
మరిగి దరిగానలేని నామానసంబు
నేరకయెజేసినట్టి యేనేరమైన

సైచిమన్నించి కృపయుంచి క్షమముదాల్చి
నీదు చరణారవింద సన్నిధిని జేర్చు. 17

గీ॥ అభయ హస్తంబునిడిబ్రోచు ప్రభుడవీవు
దాసులకు మోక్షమిడిబ్రోచు దాతవీవు
ధరణి బ్రత్యక్షదైవమై తనరినావు
తప్పులెన్నక నన్నేలు తండ్రినీవు. 18

గీ॥ ముక్తిదాయక! కారుణ్యమూర్తివగుట
నన్ను వేగమె గొనుమనీ సన్నిధికిని
ఖలులమనిబాయ నీమది దలపకయ్యా
తొల్లి దుష్టులనేలిన దొరవెకానె. 19

గీ॥ అన్నివిధముల నీసేవ తోడాచుమాదు
కష్టసుఖముల నెరుగుచ గరుణతోడ

నాదరింపంగవలెగాక యన్యమార్గ
మెందుగలదయ్యా యీలోకమందు మాకు. 20
గీ॥ పరులు నావార లను భేదమరయనీకు
గలదె? యెవరికి సముడవుగావె నీవు?
నీవె మము నిర్దయనుజూచి బ్రోవకున్న
గతియికేదయ్యా మాకీజగతిని జనక!. 21
గీ॥ కీడులోనను మేలొనగూర్చుచుండు
కష్టములువీడ సౌఖ్యంబు గలుగుచుండు
మేలుకీళ్లను వెనువెంట మెలగుచుండ
నిన్ను నిందింతురక్కటా నీతిలేక. 22
గీ॥ తండ్రి నినునమ్మినందుకీతనయునిట్లు
సర్వసంకల్పములను నిష్ఫలముజేసి

వ్యర్థరాలను జేతువో వసుధలోన
నిన్నుమనసార బ్రేమించి యున్నఫలము?. 23
గీ॥ కన్నులారంగ నినుగాంచ గల్గుభాగ్య
మున్నదో? లేదో? నాకు నో కన్నతండ్రి
తనయ రక్షించుమన్న నీదాపు జేర్చి
మొలవిశరణించి నన్నేలు టెన్నడింక? 24
గీ॥ జన్మజన్మంబులెత్తి వేసారి జాల
నింక నిహలోక వెతల భరింపజాల
ముక్తినీవయన్నిట నేనశక్తురాల
నైన మన్నింపవే? కరుణాలవాల. 25
గీ॥ ఎందుజూచిన యానంద మింతలేదు
కష్టములెగాని సౌఖ్య మెక్కడను లేదు

మాయ ప్రపంచమిది దీన మనసు లేదు
తండ్రి! దుఃఖాబ్ధి ననుముంప దలుపకయ్య. 26
గీ॥ లేశమైనను సుఖమిందు లేదు లేదు
ఇట్టి ప్రపంచమున నుండ నిచ్ఛ లేదు
శ్రమలబడుచిట్టు లోర్వంగ శక్తి లేదు
నీ వుపేక్షింప తనువింక నిలువ లేదు. 27
గీ॥ కాలమీరీతి గడువంగ గలదె? ఫలము
ఎన్నటికి నన్ను దరిచేర్ప నెంచ లేదొ
విన్నగాని యికనొక్క నిమిషమైన
నెట్లు నిలుతును తండ్రి నీవిట్లు చేయ. 28
గీ॥ మొరల వినుచుంటివో? లేదొ? యెరుగగాని
యెన్నివిధముల నినువేడు కొన్నగాని

కరుగదేమయ్య నీమది కరుణలేదొ?
సదయుడవు నిర్దయుడను బూనదగునె? నీకు॥ 29

గీ॥ విద్యగలదని మదిని గర్వింపలేదు
కలిమి గలదని నీ సేవదొలగలేదు
తనువునే నిత్యమని మదిదలపలేదు
నన్ను రక్షింపవిక తప్పులెన్ననేల? 30

గీ॥ ఎంతవేడిన దయరాదు పంతమేల
కొంతిని నిన్నునాతండ్రి కోపమేల
పిలిచిననుగాని బదులైన బలుకవేల
తనయుపై నింతకఠినంబు దాల్పదగునె? 31

గీ॥ ఎందరెందరొ భక్తులనేలినావు
ఎట్టివారలనైన చేపట్టినావు

కరుణ నాపైన లేదేమొ? కాని జనక
నీవు నన్నేలభారమా? నీలకంఠ. 32

గీ॥ భువనరక్షక నీ ప్రియపుత్రినగుచు
జనక! నీయంతవానికి తనయనయ్యు
పుడమి పడరాని యిడుమల బడుచునిట్లు
పరుల సాహాయ్యమును గోరవలసె నకట. 33

గీ॥ దివ్యమంగళవిగ్రహా! దేవదేవ!
అఖిలలోకేశ యీశ మహానుభావ
పతితపావన నీప్రియ సుతులగావ
రావ? నీ సేవకులము దిక్కీవె గావె? 34

గీ॥ వేడువారల రక్షించువాడవేని
కరుణయనునది నీమది గలిగెనేని

అనఘ! మేము నీబిడ్డల మగుదుమేని
శీఘ్రమే మాకు మోక్షమిచ్చెదవుగాక. 35
గీ॥ తెలిసికావించియుంటి తప్పులనుగొన్ని
నేరకయె జేసితిని గొన్ని నేరములను
పతితపావన! నీ ప్రియసుతనుగాన
దయనునన్నిట్లు మన్నింపదలచినావొ? 36
గీ॥ ఎన్నటికి నాదుతప్పులే యెన్నుచున్న
దయను మన్నించి నన్నేల దలపకున్న
నీకటాక్షంబు నాపైన నిలుపకున్న
నిలను నేనిట్లు జీవింపనేటికన్న. 37
గీ॥ మమ్ము కృపనేలుమని బ్రతిమాలుకొంటి
వెతలబడజాలమని విన్నవించుకొంటి

నా_ర్తరక్షకుడ వనెడి నీకీర్తివింటి
నిట్లుపేక్షింతు వనుట నేనెరుగనుంటి. 38

గీ॥ ఉర్వి నేసౌఖ్యమైన లేకున్నగాని
జనక! నీ కృపారసమున్న జాలునంటి
నిదియు కరవాయె నేటికి నేమనందు
నిహపరంబుల నొకటైన నీయరాదె? 39

గీ॥ తనయులీరీతి వెతలొంద దలపవైతి
వేడుకొన్నను కనులార జూడవైతి
యెంతపిల్చిన దర్శనంబీయవైతి
యేదనున్నావొ? నీజాడ నెరుగనైతి. 40

గీ॥ అఖిలక్షరమక్షరములనో యాదిదేవ
యెందుజూచిన సుదులేకుందువుగద

నిన్ను గాంచంగ నిచ్ఛ జనించునయ్యా
నామనోరథ మీడేర్చవేమి? తండ్రి! 41

సీ॥ నిత్యమానిర్మల సమాధినిష్ఠఁబొంది
యద్వితీయ పరబ్రహ్మమందు జెంది
నైష్కర్మ్యమైనట్టి ఘనులమ్మహాత్ములకును
భూరిసామ్రాజ్య పదవేల? భువనపాల! 42

గీ॥ శాంకరీ!నన్ను బ్రోవంగ సమయమమ్మ
ఇంకనైన నను కరుణించి యేలుమమ్మ
తల్లి! నీ బిడ్డలను బాయ ధర్మమమ్మ
పరమపదమిమ్ము నినునమ్మి బ్రతుకనిమ్ము. 43

గీ॥ కరుణతోడను నీపాదకమలములను
తల్లిరో! జూపగదవె నిన్నుల్లమందు

నమ్మిగొల్చెడి నీదుతనయులనిట్లు
విడచియుండుట నీకిది వేడుకగునె. 44

గీ॥ జనని! యీ ఘోరసంసారజలధియందు
దరికిజేరెడిమార్గంబు దొరుకలేదు
ఎవ్వరు నీచెంతఁజేర్పంగ నెంచిరమ్మ
నిన్నువిడనాడి యెన్నాళ్లు నిలతునమ్మ. 45

గీ॥ ఎన్నిచిక్కులబెట్టఁగ నెంచినావొ
నామొరాలింపకున్నాడు నాదుతండ్రి
జనని! నీవైననాచిన్ని మనవిగొంత
విన్నవింపవె తండ్రితో విసుగుగొనక. 46

గీ॥ తల్లి! నీవైనదెల్పవే తండ్రితోడ
దీనురాలను నాకింక దిక్కుగలరె

తల్లి కలిపిన సుతులపై తండ్రికన్న
ననడి లోకోక్తి నెరుగవా? యమ్మనీవు. 47

గీ॥ తల్లి నీదుపాదారవిందములు దక్క
నాకు భవసాగరంబీదు నావవేరు
గలదె? నీవె నాపైనిట్టు లలుకబూన
నెందుజొత్తును జనని! నాకేది దిక్కు? 48

గీ॥ పలువిధంబుల దిక్కుల పాలుజేసి
మనము నామాటవినకిట్లు మసలుచుండు
నీయనుగ్రహ మొక్కింత నిలుపకున్న
నిలువనీదము లేదుగా నిక్కముగను. 49

గీ॥ జనని! నీకటాక్షంబున్న జలదమట్లు
మొల్లయిక్కట్లు గడియలో నెగిరిపోవు

నీవుపేక్షింతువేని యీ నీచబ్రతుకు
బ్రతుకుటెల్లను భువిదుఃఖ భాజనంబు॥ 50

గీ॥ శంకరుని దివ్య పాదాంబుజముల నెపుడు
మదిని నిశ్చలంపుభక్తితో స్మరణజేసి
జన్మసాఫల్య మొనరింప జనులుభువిని
జననమొందిన వార లేజాతివైన. 51

గీ॥ ఇందుశేఖరు పాదార విందసేవ
భక్తితో జేసి యీభవ బంధములను
వీడి యానందవార్ధి నోలాడువార
జన్మయే సార్థకంబన జనును జగతి॥ 52

గీ॥ దేవదేవుడెల్ల తావులందుండంగ
తీర్థయాత్రలనుచు దిరుగనేల?

చపలచిత్తమునను జనుచుందురే గాని
యుందుగలుగు దేవుడిందు లేడె? 53

గీ॥ అనుభవించగవలెగాక యజనివారిత
ఫలము సుంతైనదప్పింప గలరె భువిని
రాజవరులైన పరమవిరాగులైన
దామొనర్చిన కర్మంబు దాటవశమె? 54

గీ॥ దైవసంకల్పములు విచిత్రములుగావె
కోరకమె పెక్కు మేళ్ళనకూర్చుచుండు
తెలియకుండని పెక్కుచింతలను దెచ్చు
భక్తవత్సలుడైన శ్రీపతిగుణముల
మనుజమాత్రుల కెఱుగ సామాన్యమగునె.? 55

గీ॥ ఎందఱెన్నివిధంబుల నిందఁజేసి
తన్నుదూఱుచునున్నను ధైర్యమూని
తనదుపట్టునువిడక సత్పథమునందు
జనుచు నినుఁగొల్చుభక్తుండు గను నెపరము. 56
గీ॥ ఫలసమృద్ధినివృక్షంబు వంగియుండు
నట్లు సద్గుణంబులచేత నణఁగియుండు
నిర్మలుండై పవిత్రుఁడై నెగడవలయు
సుగుణవంతుని కిహపరసుఖముగాదె. 57
గీ॥ ధరణిసజ్జనస్నేహంబు దొరకకున్న
చేయఁబోకుము మఱి యెట్టిస్నేహమైన
దుష్టులనుగన్న భయమంది తొలఁగుమెపుడు
నోర్పుగలవాఁడె బలవంతుఁ డుర్విలోన. 58

గీ॥ తాను కించిజ్జ్ఞుడయ్యును దర్పమునను
సర్వ మెఱిఁగినయట్టి సుజ్ఞానివోలె
భువినటించుట నీచునిబుద్ధిగాదె
అవని సర్వజ్ఞుడైయుండు నాత్మ విదుఁడు. 59

గీ॥ ఎట్లువచ్చితిరో యీ జగంబు
విశదముగాన నరులార! వినుఁడిమీరు
మోహపాశంబులనుజిక్కి మోసపోక
తెలివిగల్గిమెలంగుఁడీ! కలుగుముక్తి. 60

గీ॥ క్షితితలంబున మనరొక్క బ్రతుకులెల్ల
దలప క్షణభంగురంబెగాఁ దెలిసికూడ
చేలమై తుచ్ఛవిషయాది లోలురగుచు
బంధనలఁజిక్కి బాధల పడుటమేలె? 61

గీ॥ దేవదేవునిగనుటకై తీవ్రమైన
భక్తివైరాగ్యములబూని పాటుబడుడి
ఉర్వి నీజన్మనేముక్తి నొందుటకుల
ఘనతరంబగు శ్రీమ లొందగావలయును. 62
గీ॥ న్యాయమార్గంబునను నీవు నడతువేని
శ్రీశుడెప్పుడు సాయంబు సేయుచుండు
అరసి యేక్షణంబునకద్ది యవసరంబొ
నరత మట్టివేలున ప్రేమవలువునగడు. 63
గీ॥ సంశయంబులుగల్గిన క్షణములోన
దీర్చుకొనుచుండుమెప్పుడు తేటపడగ
హేళనము జేయ వలదిల నెవరినేని
సన్యమతముల ద్వేషింప నఘముసుండు. 64

ఆ॥ దానమిచ్చువాఁడు ధర దరిద్రుఁడుగాఁడు
యిచ్చుకొలఁది సిరులు హెచ్చుచుండు
బీదసాదనరసి యాదరించుటకన్నై
ధనమునంగుగాదె దైవమెపుడు. 65

గీ॥ అవని "సత్యమేవజయతి" యండ్రుగాదె
సత్యమే దేవుఁడౌట నిజంబుగాదె
దానినే జీవనముగ నాధారముగను
దలచువారలె భువిలోన ధన్యతములు. 66

గీ॥ అరయ సత్యస్వరూపుఁడౌ యాదిగురుని
సత్యనిష్ఠాపరుఁడ బొందజాలుగావ
భువినిగలనైన బరిహాసమునకైనన
నన్నృతమాడంగ దగదెట్టి యవసరమున. 67

గీ॥ సత్యమునుమించు ధర్మంబు జగతిగలదె
దానికన్నను రక్షించు దైవమున్నె?
యనుభవంబున నెరుగంగ నగునుగాని
దాని మాధుర్య మహిమను దరమె తెలుప. 68

ఆ॥ పరులమెప్పుగోరి పరమేశు నర్చింప
ఫలము నుంతయేని గలుగబోదు
దైవభక్తిలేక తరియింపజాలము
తెలియ తైలరహిత దీపమట్లు. 69

ఆ॥ భగవదాజ్ఞలకును వ్యతిరిక్తమైనట్టి
నరులయాజ్ఞ నెపుడొనర్పబోకు
జగతిబూర్ణభక్తి సజ్జనస్నేహంబు
ముఖ్యసాధనములు మోక్షమునకు. 70

గీ॥ భువిమనశ్శుద్ధితో నీవు పూజసేయు
దయను బోషించును దైవంబు తప్పకుండ
భక్తిగలవారి గందు రెప్పటికినైన
రూఢిగా దేవుని నిజస్వరూప విధము. 71

గీ॥ శాశ్వతంబైన భక్తివిశ్వాసములను
నిశ్చల ధ్యాననిష్ఠయు నీస్మరణయు
దేవ! నాకిమ్మటంచు ప్రార్థించుమెపుడు
భక్తిగలవారి కెందైన భయముగలదె. 72

గీ॥ అవనిగల్గిన యెల్లవస్తువులకంటె
మిగులభక్తిని హరిని బ్రేమింపవలయు
బ్రతిఫలంబును గోరక భక్తితోడ
గమలనాభుని భజియింప గలుగు ముక్తి. 73

ఆ॥ జ్ఞానశూన్యుడగుచు శతవత్సరంబులు
బ్రతికనేని దాన ఫలితమున్న
జ్ఞానవంతుడగుచు జగతి నొక్కదినంబె
యున్నగాని నదియె యుత్తమంబు. ౭౪

గీ॥ అన్నిటను దేవుడున్నాడటంచు నెపుడు
మిగుల బ్రేమించుటయె భక్తియగును చూడ
నిఖిలజగముల నాతడేనిండియుండు
గాన తెలివొంది దుర్మార్గకార్యములను
మరుగుగానైన జేయకు మరచియైన. ౭౫

ఆ॥ ఆత్మసౌఖ్యమెప్పు డనుభవించెడివారు
విషయసౌఖ్యములకు వెదుకబోరు

మాయజగమటంచు మదినెంచివిడతురు
వారి కేల యెట్టి వైభవములు. 76

గీ॥ విషయము లపాయకరములు విషమువోలె
ఆశయే పిశాచమువంటి దరయభువిని
ధనము వైశ్వానరజ్వాల కెనయగునుమ
మోహమొక వల యిది యెంచి మోసపోకు. 77

గీ॥ విషయసుఖమను లేడిని వెంబడింపఁ
కల్లసంసారమను ఘోరకాననమున
విడచిపెట్టును త్రోవను వెదుక లేక
తల్లడిలు తుదకాజీవి యొల్లగతుల. 78

గీ॥ జగతి భార్యను ప్రేమింప శక్యమగును
దానిని బ్రేమింప దరముగా దల్పులకును

దలప జతి శవంబులగాల్ప గలుగుగాని
చింత ప్రాణులనైన హింసించుగాదె.
ఆ॥ అన్నదమ్ములైన నాత్మబంధువులైన 79
సుతులుహితులెయైన క్షితితలమున
ధనముకొఱకు దయ విదారించి హింసలు
సలుప జంకరిలను తులువజనులు.
గీ॥ ఆశగలవారు ధనవంతులైనగాని 80
భువిదరిద్రులె యాగావె పోల్చిచూడ
బంధుమిత్రులు మఱియెల్ల భాగ్యములును
దప్పక నశించునవెయంచు దలపుమెపుడు.
ఆ॥ తానొనర్చినట్టి తప్పుల నొరులకు 81
జెప్పిమదిని వగపు జెందిమరల

నట్టిదోసమెన్న డాచరింపక యున్న
బావశాంతిగలుగు భయము లేదు. 82

ఆ॥ మనసునిల్పలేని మనుజుండు మోక్షంబు
నొందబోడుగాన, ముందుగాను
మనసునిలుపనేర్చి మరి మోక్షమందంగ
యత్నపడెడువాఁ డధికుఁడందు(). 83

గీ॥ అఖిలజనులను మెప్పించినట్టి ఘనుడు
పుడమిలోనేటివరకును బుట్టలేదు
ఎల్లరికిసంతసము గూర్పనెంచువాడు
తానకు నొకరికేనిసుఖంబు గూర్పలేడు. 84

గీ॥ ఇనుమ లెన్నైని వినువక గుఱుచుచున్న
నోర్చిధైర్యంబు మదిదాల్చి యుండవలయు

గప్పములుగల్గు టిలసీతి గరవుకొరకె
యీశుడేమిచ్చు నవియెల్ల హితముకొరకె. 85

గీ॥ అవని నధికప్రసంగమే హానిదెచ్చు
నూరకుండుటయే చూడ సత్తమంబు
మౌనమును దాల్చి యీశు నెమ్మదినినిల్పి
ధ్యానమొనరింపుమది ముక్తిదాయకంబు. 86

గీ॥ అవని దమకన్న హీనమానవులఁజూచి
తనకు గలిగినంతకుదృష్టి గొనగవలయు
నొరుల శ్రేయంబు మదినోర్చి యుండవలయు
సహనమే యెల్లభంగుల జయముగూర్చు. 87

గీ॥ అరయ నినుమించువారు లే రవనిలోన
నింద్రుడవునీవు చంద్రుడ వీవటంచు

భువినిఁగొందఱు నిన్నెంత పొగడుచున్న
నంత గర్వింప కవి ముఖస్తుతు లెగాన. ౪౪

గీ॥ ఎవ్వరు పరులదోషంబుల నెంచువారు
తమకుఁగల లోపములకైన దలపబోరు
విమలవిజ్ఞాన వేత్తలౌ విబుధులరసి
ఖలులయందేని సుగుణము ల్గనుచునుందురి. ౪౫

గీ॥ హృదయమందలి భావంబు వదనమందు
నద్దమునఁబోలె గోచర మగుచునుండు
గాన మదిలోన దుష్ట సంకల్పములను
మానినిర్మల జ్ఞానంబు బూనవలయు. ౪౬

గీ॥ పక్షములఁజూచి నేర్వంగ జాలునట్టి
దెద్దిలేదంచు మూఢు లూహించుచుందురి

జడులబాఁచియు ఘనులు సజ్జనులుమాత్రి
మెన్నిరెూ నీతులను గ్రహించుచుండ్రి. 91

గీ॥ చెడుగుణంబుల ఏడక శివుని వేడు
వంతనే యేరు మోక్షంబు నందలేరు
పథ్య మౌషధమును మాని వైద్యుగొల్చు
మనుజులకు నెందరోగంబు మానగలదె? 92

ఆ॥వె॥ చెప్పుమాటకంటె చేయు పనియె మేలు
నడువునట్టి నీతి నడువ మేలు
పరమపదము నొంద భక్తిమార్గము మేలు
భక్తిహీనుకంటె పశువు మేలు. 93

గీ॥ పుట్టుటయు పెరుగుటయును భూమిలోన
మరణమును రోగమును దుఃఖకరములగును

బాల్య యౌవనములు నశాశ్వతములగును
నిలువదిలలోన దేహంబు నీటిబుగ్గ. 94
గీ॥ మనుజమగునట్టి కడవెడు మందినీట
దలప నొకబొట్టు విషమని గలసెనేని
ద్రావుటకు నంతమాత్రంబు దగనియట్లు
పరముగోరిన విషయముల్ బాధకములు. 95
గీ॥ అస్థిరంబైన జగము నిత్యంబటంచు
నమ్మి చెడుచుంటివింత జ్ఞానంబులేక
అకట! చిత్రమా! నిన్నేమనందు భువిని
మాయయే నిన్ను మోసంబు సేయుచుండె. 96
ఆ॥ వె॥ ఒరులు నీకు నెట్టులొనరింపగోరెదో
యట్లు పరులకీవు నాచరింపు

మిరియు లేదు సీయ నిష్టంబుగాదొ నీ
పట్టి పనుల జేయ కన్యులకును. 97
గీ॥ అంటియుంటక సకల కార్యములయందు
బురదయందుండు తమ్మరపుర్వపోలె
మెలకువను సర్వకాలంబు మెలగవలయు
ముక్తిగోరెడి భక్తులాసక్తితోడ. 98
గీ॥ బోధచేయువారు బుద్ధిమంతులెగాని
యట్లు నడచువార లరుదుగాదె
చెప్పువారలెల్ల చేయువారలైన
లోపమేమిగలదు లోకమునను. 99
గీ॥ ఎన్నిబోధలైన నితరులకెరిగింప
వలవియగునుగాని యట్లునడువ

గీ॥ తప్పులున్నవటంచును దలపకయ్య
దేవ నీదివ్యపాదార జీవములకె
భక్తి నీచిన్నిపాత్ర మర్పణమొనర్తు
గైకొనుముతండ్రి మది ననుగ్రహముతోడ. 1

సీ॥ నాయిష్టదైవమా నీయందుభక్తిచే
బొత్తంబువ్రాయగా బూనుకొంటి
పద్యలక్షణములఁ బారఁజూడగలేదు
శాస్త్రంబులైనను చదువలేదు
నీయనుగ్రహముచే నిర్వహించితిగాని
భక్తవర్యులనే నశక్తురాల
జగతి నీస్మరణచే సాధింపగారాని
ఘనకార్యమేదైన గలదె తలప

గీ॥ నీవు ప్రియభక్తులనుబ్రోవ నిశ్చయించి
దాసపోషణబిరుదు తథ్యముగను
జేయ సంకల్పసిద్ధులఁ జేయలేవ
నీవు కృపగల్గకొదవేమి నీలకంఠ. 2

సీ॥ భక్తమందార! సౌభాగ్యసంచార!
మోహనాకార! కేల్మోడ్పునీకు
పాపసంహారకా! భవవార్ధితారకా!
నాగభూషణ! వందనంబునీకు
లలితపావనశీల! శ్రితజనపరిపాల!
కరుణాలవాల! మంగళమునీకు
మోక్షప్రదాతయౌ! దాక్షిణ్యసంపూర్ణ!
ఉమరేశవినుత! జోహారునీకు

గీ॥ విమలచారిత్ర! యివె ప్రణామములు నీకు
అతుల కారుణ్యసాంద్ర! సంస్తుతులు నీకు
శమనిధాన! సాష్టాంగ దండములు నీకు
శ్రీమహాదేవ! భవ! నమస్కృతులు నీకు.

సీ॥ భక్తులకన్నుల పండువుగాఁగను
బ్రత్యక్షదైవమై పరఁగెనెవఁడు
శ్రీకరుండై మాయ లోకాద్యతీతుఁడై
కరుణాలవాలుఁడై గ్రాలునెవఁడు
నిర్గుణబ్రహ్మమై నిర్మలమూర్తియై
యాద్యంతశూన్యుఁడై యలరునెవఁడు
సజ్జనపూజ్యుఁడై సన్మాన్యచరితుఁడై
నిర్మానమోహుఁడై నెగడునెవఁడు

